మత్తమాతంగ కన్యాసమూహాన్వితే భైరవైరష్టభిర్వేష్టితే దేవి నామాదిభిస్సంశ్రితే లక్ష్మ్యాది శక్తికాసేవితే భైరవీసంవృతే పంచబాణే సత్యాచసంభావితే ప్రీతిశక్త్యా వసంతె భక్తిభాజాం వరం శ్రేయసే కల్పసే చందసామోదసే భ్రాజసే యోగినాం మానసేధ్యాయసే గీత విద్యాదియోగాది తృప్తేనసంపూజ్య స్యైభక్తి ముచ్చాదసా వేద శాస్త్రాయసే విశ్వహృద్దేవ వాద్యైవ విద్యాధరైగీయ సేయక్షగంధర్వ సిద్ధాంగ నామండలైర్మండితే సర్వసౌభాగ్యవాంఛన్వతీ భిర్వధూభిస్సురాణాం సమారాధ్యసే సర్వవిశేషాన్వితం చాటుగంధా సముచ్చారణం కంఠమాలోలసద్వర్ణ రేఖాన్వితం కోమల శ్యామలోదారపక్షద్వయం తుండ శోభా నిదూరీ భవత్కింశుకాభం శుకం లాలయంతీ పరిక్రీడసే పాదపద్మద్వయే నాపరేణాక్షమాలాగుణం స్ఫాటికం జ్ఞాన సారాత్మకం పుస్తకం బిభ్రతీ యేకసంచిత్యసే చేతసాతస్య వక్త్రాంత రాద్గద్య పద్యాత్మికా భారతీనిస్సరేద్యేవ వాయియానసనాభాకృతిర్యాభవ్య సేసోపిలక్ష్మీసహస్రైః పరిక్రీడతే కిన్న సిద్ధ్యేద్వపుశ్యామలం తావకం చంద్రచూడాన్వితం న్యాయతసస్య లీలాసరా వారధిస్తస్య కేళీవనం నందనంతస్తస్య భద్రాన సంభూతలం తస్యగీర్దేవతా కింకరీతస్య చాజ్ఞాంకరీ శ్రీస్స్వయం సర్వయంత్రాత్మికే సర్వతం త్రాత్మికే సర్వముద్రాత్మికే సర్వశక్త్యాత్మికే సర్వచక్రాత్మికే సర్వవరాత్మికే సర్వరూపే జగన్మాత్మకే పాహిమాం పాహిమాం

## పారాయణము చేయవలసిన సమయములు

ఈ దండకమును తరువాత వ్రాయబడు అమ్మవారి దండకములనుగూడ మంగళ, శుక్రవారముల యందును; గ్రామములో కలరా, మశూచికము (స్ఫోటకము) ఆటలమ్మ మొదలగు సంటువ్యాధులు ప్రబలియున్నప్పుడు ప్రతిదినమందును సూర్యోదయ సమయమందును. సూర్యాస్తమయమయిన తరువాతను ముఖ్యముగా నీయంటు వ్యాధులు వచ్చియున్న గృహమందు రోగి శయ్యవద్దను పారాయణము జేయవలెను.

## ఫలశ్రుతి

కలరా, స్ఫోటకము, ఆటలమ్మ, మహామ్మారి. మరిడీ బాధ్యములుగల గృహమందు రోగియొక్క శయ్యవద్ద సాంబ్రాణి, గుగ్గిలము మొదలగు ధూపములతో పఠించినచో త్వరలో రోగము నివారణమయి రోగి జీవించునని యొక నమ్మకము కలదు తరువాత దండకములకుగూడ నిదియే ఫలశ్రుతి.

## కాళికా దండకము

శ్రీమన్మహాదేవదేవీ నుహీమండలావాసమై యున్న యో దేవతాసార్వభౌమామణీధీమణీ లోకసంచారిణీ భక్తచింతామణీ దుష్టశిక్షామణీ మంజు భాషామణీ పాపసంహారిణీ పుణ్యసంచారిణీ ముక్తి కాంతామణీ పావనీ నిన్ను వర్ణింప బ్రహ్మాదిశేషుండును న్నోపగా లేరె నేనెంతవాడ న్థరన్మన్ను యాదానవానీక దుర్మార్గులంబాపగా పెక్కురూపంబులం బెక్కు నామంబుల న్నుద్భవంబందవే లోల్లి యింద్రాది లోకంబునం

జేరి తాఁజేయు కల్లోలముంజూచి భీతాత్ములైయుండు పుణ్యా
త్ములౌ దేవసంఘంబులం ద్రుంపగాఁ జూచి మాంసాదికానేక
శల్యాపురీషాదులంగల్గు రూపంబులుం ద్రోయగా దేవతానీక
మాబాధలంజిక్కి తాఁజేయు నద్దేవియుంగాన కోదేవి యోశాం
భవీ శాంకరీ కన్యకాదుర్గాంబ యోకంచి కామాక్షి యోకాళి
యోపార్వతీ శ్రీభవానీ సురాపూజితా దేవదేవీయటంచుం
గడుం దీనతంబొంది నిన్నాస్తులై వేడ నాతాపముల్బాపంబె
యుం బెక్కులౌ బాహులన్ఖడ్గ శూలాద్యనేకాయుధాల్బట్టి
ఘూంకార మొప్పార క్రోధాగ్నిజ్వాలా ప్రకాశంబుచే
వెల్గుచు న్వచ్చునీమోమునుం గాంచి యాదానవానీక బృం
దంబు లబ్బబ్బ యీరూపమేనాడు జూడంగలేదంచు యోతల్లి
యోమాత యోదేవి రక్షింపు రక్షింపుమంచుం డగన్వేడు
చున్నట్టి యవ్వారిస్వాడి మహిషాసురుం ద్రుంచి దేవా
దులం గాచిరక్షించవా భూమినింగల్గు నేశేషలోకంబు
లం బుట్టివర్ధిల్లు నీమానవానీక మయ్యౌశయ్య పీయూగ్రహంబం
దునంజిక్కి బందీకృతుల్గాగ క్రోధంబుచే నీవు తీవ్రంబుగా
తాపముంగల్గగాఁ జేసితే కేకలార్భాటముల్గల్గగాఁ జేసితే గొప్పగా
పెక్కుగా పెక్కులెక్కించిత్రే దేహమాయాసముం నొప్పులు
దీపులుంగల్గగాఁ జేసితే నోటి కారోగ్యమున్బాపియున్నోరులు
న్నేత్రరోగంబులున్గల్గగాఁ జేసితే వారినింగొల్చి నీయుత్సవం
బొప్పగాఁ జేతు మోతల్లి యోదేవియంచున్నడు బెక్కుదండంబు
లం బెట్టగాజాలియు న్బొంది యారోగ్యమున్బొందగాఁ జేసితే

వారు నారోగ్యముం బొంది స్నానంబులుంజేసి యానంద
వారాశినిందేలి నీయుత్సవం బొప్పగాజేసియుం జంతుజాలం
బులం బంట్లుబకార్లన్న వానీయము ల్భక్తితో దెచ్చి నీకర్పితం
బొప్పగా జేయు సంతోషముజెంది నూకాలనే పేళ్ళ మారీ
మహాంకాళినామాదినానేక నామంబులంజెంది తాముండు
నీరూప తేజంబులంజేర్చియు న్భూతసంఘంబునం గాలి
దయ్యంబులం న్శాకినీ మోహినీరాక్ష సానీకము జేర్చియు
న్విందు గావించి సంతోషముం జెందుచున్నట్టి యోదేవి
యోతల్లి యోమాత యీనాడు యీగ్రామ మందుండి
యీరీతి మాబిడ్డలన్బాధ నొందింపగానేల మేమెన్నడున్నీకు
నేయెగ్గు గావింపగా లేదె లేకున్న యీపాప లేకూన లేమైన
గావించినం తల్లి చందాన శాంతంబునుంజెంది జ్ఞానంబునుం
గల్గగా జేయ లేకిట్టి ఘోరంబుగా బాధనొందింపగానేల
నోయంబికా శాంభవీ పావనీ లోకమాతా మముం గావ
నీకన్న వేరెవ్వరున్లేరు కాపాడి రక్షించు మీబిడ్డలంజెందు
యీతాప మాయాసముం బాపియే బాధలేకుండగా యంగ
రోగంబులు నేత్రరోగంబులున్ క్షుత్తుదుఃఖంబు లేకుండగా
జేసి మాబిడ్డల న్మామహా త్తిళ్ళతో జేర్చుమీచేర్చినన్నీకు
మాశక్తి లోపంబు లేకుండగాపానకం బాడిగాదెచ్చి నీకర్పితం
బొప్పుగా జేతుమోతల్లీ దేవి భవానీ పార్వతీ శంభురాణీ
కృపాదృష్టిచే మమ్ము గాపాడు నీకన్న మాకెవ్వరున్వేల్పు
లున్నారు. నిన్గొల్చి యేటేట నీయుత్సవం బాడిగా జాతరల్సేసి

శీర్షంబుగావించ యానందమునుం బొందుచున్నండ మాయమ్మనే
నీకంత క్రోధంబుగల్గంగ మాచేయులోపంబు లేమైన నున్న
న్నధా మమ్ముసన్మాత వైగాచి రక్షించరాదేసురా నీకమ్ము
జూచు చందాన మమ్మెప్పుడుం జూడగారాదు మాయాపద
ల్బాపికాపాడుచుం బాడియుం బంటయు సంపదైశ్వర్యము
న్నిచ్చి బ్రోవంగరాదేయటంచు న్వేడిన్నిన్ను యీకీర్తి
స్తోత్రంబునుం జేయు నీపాదభక్తుడు నీదాసదాసానుదాసుండు
కాకాపురీ వాసుడున్ వైశ్యుడు న్గుండువంశాబ్ధి సోముండనం
చెల్లు సర్వేశనామాఖ్య సత్పుత్రుడు న్నార్య భక్తుండునై
గొప్పభూమిం జగన్నాధదాసుండ నిం గొల్వగా దండకం
బొప్పగా వ్రాసి నీకంతమందార్క పూదండగానుంచగా
నెంచి నీకర్పితం బొప్పగా జేసితిన్ మొక్కలాలించి మాపిల్లలం
గాంచి మాయాపదల్ద్రెంచి మాబిడ్డలంబ్రోవు నీతాపముల్బాపి
రక్షింపుమా తల్లివై జూడుమా దాతవై బ్రోవుమా తండ్రివై
గావుమా నేతవై గాంచుమీ దేవివై బ్రోవుమా యమ్మ
నూకాల తల్లీ మహాంకాళి దేవి సురాపూజవల్లీ మహామ్మారి
కాళీ భవానీ విశాలాక్షి యోకంచి కామాక్షి యో శాంభవి
శాంకరీ పార్వతీ యన్నపూర్ణామహాదేవి మీరందరు స్నేహ
భావంబుతో మమ్మురక్షింపుడీ బ్రాహ్మణుల్ క్షత్రియుల్
వైశ్యులు న్శూద్రసంగంబులు న్నీదు నామంబుల న్మానసం
బందు సద్భక్తితో నిల్పి స్తోత్రంబులం జేయు నవ్వారికింగాక
యీదండకం బెప్పుడు న్భక్తితో పల్కునవ్వారికిన్ వ్రాయు

సర్వారికిం బాపముల్బాపియు న్మోక్షముం గల్గఁగాఁ జేయవే నో
రితిన్నాదు వాక్యంబులందుండు దోషంబుల న్నెంచక క్షేమ్యున్
నీదాసునింగాంచి రక్షించుమా లోకమాతా నమస్తే
నమస్తే నమః.

పఠించు కాలము

వెనుకటి దండకమునకు వలెనే యని తెలియవలెను.

శ్రీ అమ్మవారి దండకము

శ్రీమద్వినేత్ఫా భవేఽస్ముల్లసత్పద్మపాణిస్ఫుర ద్రత్నచూడా
మణీ మంజుసంభాషణే భక్తసంసేవితే దుష్టవల్లీలవిత్రే నున
స్తోమ సత్కల్ప వల్లి పరంజ్యోతిరాద్యే గృణాసూనచిత్తే
మదోన్మత్తకుంభీంద్ర కుంభాభవక్షోజ హేచండపంచాస్య
పత్రేమునీంద్రాంతరంగాబ్జ మిత్రేరిపు స్తోమజైత్రేమరుత్వాక్ప
రిష్కార భాస్వత్కళత్రే గదాఖడ్గభృద్బాహు కంజద్వయే
సర్వతోదగ్ర కాంతారవాసప్రియే ప్రస్ఫురచ్చంద్ర భృత్పుస్త్రా
భాగయష్టే శరద్రాజ బింబోపమాస్యే సుముక్తావళీజాల
సంకాశితే సదా విద్రుమమోహ్య ద్విజాతే శరత్పూర్ణిమా చం
ద్రికా వాదబీజే విముగ్ధప్రభాతాబ్జ తుల్యాక్షి సాహస్రకేస్నిగ్ధ
చాంపేయ పుష్పాభ ఘోణోజ్జ్వలే ఖండ శీతాంశు సంకాశ
ఫాలే లసద్భృకుటీతే ప్వానయుగ్నేవి యన్నిమ్మగా సూక్ష్మ
త్తరం గోమశ్రీవళీ సంయుతే కంబుకంఠోత్ర యీాధర్మసాపేక
పద్దర్పణా కారగండే కరుశోండ బాండా మాహూభృత్పు
చండే ద్యురత్న ప్రభాభాసమానే మదోన్మత్త వేదః

మాంకితా సర్వలోకైక సంభావితా తారకాహారనీ హారక్షీ
రాబ్ధిడిండీర సత్కుంద మందార కంకేరవోద్యత్సుమాళీ శరచ్చం
ద్రికాసాంద్రధావళ్యసమ్యగ్యశః పూరకర్పూర హారాసుహారా
వళీ ప్రస్ఫురద్రత్నవసు ప్రభాజాలసాలంకృతాంచచ్చకీరా శరీ
రాంతరవ్యాప్తకస్తూరికాగంధ సారాకటిస్థాన సత్కుంభినీంద్ర
ప్రశస్తోరుధీరా సువీరా జగద్వ్యాత హేతుప్రచారా చలత్కిం
కిణీ కంకణక్వాణసంశోభితోత్ఫుల్లకంజాతపాణీ ప్రమోదాభ
శృంగార వేణీకళాధార వాణీవత్సైకతశ్రోణీపంచాస్యఘోణీగుణీ
రక్షితానేకబందారకోద్యల్లలాటస్థసింధూరసాందారుణాంఘ్రిజగ
న్మంగళాంగీ విలాసప్రసంగీతసాహిత్య విద్యావిశాలాసుశీలా
తృణప్రాయసంగ్రాహితోద్యద్ధ్వజప్రస్ఫురద్బాణతూణీరసంభా
రహస్తాంబుజశ్రేణికళ్యాణి గీర్వాణి సర్వాణి హుంకారిణీ భద్ర
సీమా ఉమా శాంకరీ చండికా యంబికా శాంభవీ పూతగం
గాసుదుర్గామహాంకాళి కాత్యాయని రాజరాజేశ్వరీ యాదిశక్తి
శివానీ భవానీ మృడానీ కృపావీక్షణీ దీనసంరక్షణీ భద్రకాళీ
శరద్రాజ రాజన్ముఖి తావకీనప్రతాపప్రభావాదికమ్మున్ భవ
న్మార్గసంబోధన ప్రజ్ఞలంబూని వర్ణింపగా నాదిమధ్యాంత
సూన్యంబునై యాదిమధ్యాంతసంపూర్ణతం
జెంది బ్రహ్మాండభాండంబునన్ దండిగానిండియుండంగ
నీమాయ నీఛాయలందున్ బ్రశంసింప శక్యంబె బ్రహ్మేంద్ర
ముఖ్యామరుల్ వర్ణనల్ సేయగాజాలరైరమ్మ నీమానస్వేచ్ఛా
విహారక్షణస్పృష్టిగాదే సమస్తంబు మూర్తిత్రయంబుల్ నవ
బ్రహ్మ లేకాదశీరుద్రులున్ ద్వాదశాదిత్యులుం దేవకోటీ

సముత్పన్నము న్వేదముల్శాస్త్రము ల్మంత్రముల్తంత్రము
ల్యంత్రముల్ జీవరాసుల్ మృగానీకముల్ నక్షికాపక్షివృక్షా
ద్యనంత ప్రపంచంబు నీచే గలుంగుం జెలంగుం దొలంగుంగదా
సర్వమున్నీవె తల్లీ జగత్పావనీ నీచరిత్రముల్ సర్వలోకా
దృత స్తోత్రపాత్రంబులై నిత్యదేదీప్యమానంబులై యుండె
నజ్ఞానుఁడన్ గ్రామ్యుఁడన్ స్వల్పమాత్రుండ నేనెంతవాడ న్విచా
రించి శ్లాఘించఁగా నైన నా నేర్పుచందంబునం బొందుగా డెంద
ముం బొందియందంబుగా డంబుగా నెంచి నీయంకితం బేర్పడం
మంచిపూదండగా విందుగా దండకం బొక్కటిం జెప్పి నీకిచ్చు
చున్నాఁడ నీవర్తమానస్థితిం గూర్చి యాపన్నివారంబులం జేయ
నా శక్తితో రక్తితో నీకుభక్తుండనై దండినై నిన్ను సేవించె
దన్ నాదు జిహ్వాగ్రసంస్థాయివై నీవు వర్ణక్రమాక్షేపణల్లేక
చందోవిశుద్ధంబు రానీక కాంక్షించు మాదోషముల్వచ్చినం
గాని మన్నించి రక్షించుమా సర్వభూతప్రపంచంబు నీసత్కృ
పావీక్షణాక్షీణితంగాదె వ్యాళ్లుటల్ నమ్మమాపిల్లలం బెద్దలం
మిత్రులంబుత్రులం మాపురీవాసులన్సోక రాకుండుమా భీతియే
హేతువై యుండకుండంగ ప్రఖ్యాతితో మాకు నిర్భీతిగావిం
చుమా తల్లి యీతల్లడం బెల్లయుం జల్లగా మాన్పి నమ్మెల్ల
బ్రోవంగదే తల్లికోపించితే పిల్లలన్సాకువారెవ్వరే కన్నతల్లీ
సదానందవల్లీ సుహృద్భక్తమాన్య ప్రజాకల్పవల్లీ మెరుంగైన
ముంగాలసింగారముల్గా ర్పదార్వన్నె బంగారుపుంజట్టు
పుట్టంపుతా బందుఖంగుల్ జెలంగంగఁదగన్ సన్నపుంహొన్ను

జల్తారుసుంబా గులాబీ హారరంగుల్ సురాలించు మేల్జాళువా
చీరచెన్నారగా కుచ్చెళుల్ దీర్చి దాల్పంగ నీసన్నలేగౌను
నందల్కుట్టొడ్డాణపుం జెట్టుబల్కట్టునిట్టంబుగాం జేర్చి విన్నా
ణశా వేణిపై రత్నసంఛన్న స్వర్ణప్రభాకీర్ణపర్యంత భూషావళిం
బొందగం జిత్రచిత్రోపమక్కంచుకం బుబ్బుచన్నుబ్బలం దబ్బ
రంపుం బిగింగూర్చి జాబిల్లిలో చిహ్నమిన్నట్టు నామోము
జాబిల్లిపై నల్లకస్తూరిరేఖం బసందొప్పగాదిద్ది పెన్నల్లగల్వల్లదా
సాటియన్నట్టి నీకన్నవం జక్కగా కాటుకల్దీర్చి బల్సొన్నమ్ములం
దమ్ముగానించి క్రొందళ్కు వజ్రకపునత్తుంబులాకీయునుం నాసి
కాగ్రంబునందున్ ప్రకాశింప తాటంకము ల్కర్ణయుగ్మంబునం
దాండవంబాడు చుండంగ సుగ్రీవహారంబులల్లాడ మేల్బాజు
బందుల్ని గారంపుగాజుల్ విరాజించు పోచీలు నొల్సుల్కడెం
బుల్మురుంగు ల్మెరుం గుంగరాలుంగరంబుల్వెలుం గొప్పగా
నుంచి పాదంబుల న్బావడాలాదిగా వింతవింతైన సన్మండనంబు
ల్ఘటింపం బ్రశస్తంబుగా పౌరభాస్వీత పుష్పావళుల్గొప్ప నం
గొల్చియుం గేలగీలించియుం దేవసౌంధికాసారమున్నేని పై
జిల్కుకొంచుం హరిద్రావిలేపాండివై మంచికర్పూరపు న్వీడె
మున్ చేయుచున్ తీరుగా నొక్కచేతన్ లసత్కుంకుమా
పూర్ణసంయుక్త పేటీసమాకర్షణన్ జేసి వేరొక్కచే పైడిబెత్తం
బునుంబూని గూర్మిన్ సహస్రాక్షిదృష్టు ల్పరిసారింపుమన్
మందహాసంబుతో నిల్చి కస్తూరి జవ్వాది తావుల్గుభాళింపగా
సొంపుగా నందియ ల్గజ్జలున్ ఘల్లుఘల్లంచు మ్రోయంగ

స్వాంతాభరణా మేఖలాఘంటికా నాదముల్సేయగా చామరా
శ్రీకర శ్రీకరంబునన్ వచ్చి కూర్చున్న నీపాదసేవార్థమై దేవతా
కాంత లెల్లెదిరిన్ గొల్వనం గొల్వగానందు రంభోర్వశీ మేన
కాస్సుదతిన్ నాట్యముల్సల్పగా నందులో కొందరీ యిందుబిం
బాస్య సౌందర్యమున్ జూచితే సుందరీ చంద్రబింబంబునన్
జేయదే మోమ్మను కెమ్మోవి బింబంబు నెల్లం దిరస్కారమున్
జేయు నెమ్మోవికాంతుల్ గళుక్కంచు విద్యుద్విలాసంబులం
గ్రిందు సేయుం భళీ కర్ణయుగ్మంబు శ్రీకారము ల్గబ్బిగుబ్బల్గియుల్లా
స్యముల్పద్మముల్మధ్య మంబంతరిక్షంబు యూరే విశాలంబులౌ
కన్నులాగంతు మీనుల్గదే సోయగంబా కచంబభ్రమే దంత
కాంతులతలనన్ వజ్రపల్తుల్యతీ కంటివే కంఠమా శంఖసాదృశ్య
మైయొప్పె నౌగాని నూగారుతీ రెన్నగా పన్నగంబౌనె
నానాసాచకోరాక్షి తానమ్మాంచనస్సజ్జీయుంచు నీదేవివిం బిల్వ
గానచ్చునే గాని యాపిక్క తెల్లుల్నచూడు నక్రంబు
లైయొప్పె నీతన్వి మీగాళ్ళ సారించితే మంచితాంబేళ్ళసాటిం
విలంఘించు నంచీప్రకారంబుగా ముచ్చటల్గీర సల్లాప వాక్యోప
వాక్యంబుల న్నిన్ను బేర్కొంచునుండ న్మరిగొందరీ పుండరీ
కాక్షు బ్రహ్మాండ భాండోదరాభిఖ్యమైయుండగా దక్కు వే
లొంచు సుస్తోత్రపాఠంబులన్ సల్ప సర్వామరుల్పాసురల్ వీచి
కై వారముల్సేయగా నీవు నత్యంతకౌతూహలాయత్తచిత్తంబు
స్వర్భూర్భువ స్స్వర్గపాతాళ లోకాఖిలాండలంబుల న్గాల బాలింపు
చున్ కేడ్క నీమర్త్య లోకంబునందెన్ని యోరూపముల్బా

మరజ్ఞాన నిష్ఠార్థమై దాల్చియున్నావు నీయొక్క మాహా
మహత్వంబు శోభింపగా నెవ్వరుంజాల రష్టాదశపీఠ కాధ్యక్షవై
నొక్కచో హేమ దుర్గాఖ్యచే నొక్కచో నన్నపూర్ణాభి
దానంబుచే నొక్కచో పీఠికా పట్టణంబందు పూర్ణాహుతికా
శక్తివై కొన్ని చోట్లందు నూకాంబికా మూర్తిచేతం మరిం
గొన్ని చోట్ల న్మహామారిగా నుద్భవంబంది దుర్గాడలో
వేములాంబా మహాశక్తివై యార్తు లేరూపముంగూర్చి ధ్యానిం
చినం దక్షిణధ్యాన మాత్రంబునం బ్రోతునోహో యటంచున్
బ్రతిధ్యానముల్ సేయుచుం గోర్కెలీడేర్చుచున్ కామరూప
ప్రభుత్వార్హ తాతీతవై నీవు చెందుర్తిలో నాలయ ప్రాంత
సంస్థాయివైయుండ నూకాలతల్లీ యటంచున్ రహింగొల్వగా
చల్లగానెల్లవారిం నిరోగాప్తి నిష్టార్థసంసిదుల న్నేయగా
వారలేటేట నీజాతరన్ చాల బాజాల్బజంత్రీలు సోనాయి
మేళమ్ములున్ గొప్ప నౌబత్ నగారాదులన్ కాహళీభేరికా
నాదముల్డప్పులన్ దుడ్డువులున్ డోళ్ళుతిర్నానములల్పంబ
నాదాలు బాకాలనేకమ్ము లేకమ్ములై మ్రోయగానాడుచుం
బాడుచుండన్ విదేశస్వదేశ ప్రజావాళి నీయాలయ ప్రాంత
భాగంబు లన్నిల్చి నీయుత్సవంబెల్ల నేత్రోత్సవప్రాప్తులై
వారిశక్త్యానుసారంబుగా నారికేళాది ఖర్జూరరంభా ఫలాదుల్వ
డంబప్పు చల్మిళ్ళులున్ చీరల న్బోతులం బాతలం గొర్రెలం
వేటపోతుల్సమర్పించి సారాయియున్ కల్లు మొవ్వగలుగన్
దండిగందెచ్చినీకై నివేదింపగా నారగింపంగ దత్తత్ప్రసాదం

బులంబొంద హృద్గాంతరంగంబులన్ సంభ్రమ క్రీడలుం దేలుచుం
దేలుచున్నా మహా భక్తసంత్రాణ శీలాకృపాలాఘు పాపౌఘ
సాధ్వీజ్యజాలాభవన్మూర్తి లోకంబులో వ్యాప్తమైయుండె
నింకెవ్వరుం దాళగా జాల మీకైన నీమానసాంబుజ్న చోటన్ని
ముక్తావహాసాయినై ప్రాణముల్గాచి రక్షింపవే దాల్మినా కేరి
యంబున్ ప్రకాశింప కన్నారిగాపాడవే పిల్లలందెంత వాత్సల్య
తాధిక్యమూ నీకు హృద్గోచరంబేకదా పిల్లలంగాచి రక్షింపవే
పెంచవే వేగదేహంబులం జిక్కు లేకుండగా జేయుచుం జక్కగా
పక్కలన్ రెక్కలం జెక్కులం ముక్కులంగల్గు బల్పొక్కు
లన్ రక్కుచున్ ముక్కుచు న్మూల్గుచున్నాడు నామాట
చెల్లించు నీధాటిచాలించి యీపాటి యాపొక్కులన్ జిల్కి
జల్కుంబు లాడించవే యుష్ణము ల్వాతము ల్కాళ్ళయీడ్పున్
దొలగించి యంగంబులే లోపమున్ జెందకుండం ప్రసాదించ
వేయెంచవే ముట్పాటల్ దీరనాడించ మేలమ్ము గామించి
మాట్లాడు భాగ్యమ్మునం గూర్పవే నిద్రగల్గించి దుస్స్వప్న
ముల్సృష్టి దోషంబులం బల్విరెంతల్వి దాహంబు లేకుండగా
జేయుచున్ దుష్టప్రయోగంబులం జేరనీకుండగా యక్షిణీ
రాక్షస ప్రేతభూతాదులన్ మోహినీ కామినీఢాకినీ శంకినీ
యక్షసంధి గ్రహాళిన్ పిశాచంబులన్ సర్వదృష్టగ్రహాళి న్ని
గించి పైసోకకుండ న్నివారించు మావేశమైనట్లుగా దోచెనా
వాటినింబట్టి గుండెల్బగ్గొట్టి కేశంబులంబట్టి కంఠంబు నం
దున్నశానట్లుగా గూల్చి పక్షంబులం హస్తంబుల్లంచి నీముష్టి

ఘాతంబులన్ వాటినెల్ల న్నిరోధించి హింసించి సిద్ధాసుధా
మంబుగా మృత్యుసంహార కారంబునన్నేయు వే సర్వరోగంబుల
స్గ్రాడ నీవేనివారించ వే వేడుచున్నాను గదె వేడుకల్దీర్చ వే ఈమ
హాదండకం బంబికాయంబికా బీజవర్ణాయుతోగ ప్రభా
వాఢ్యయై యుండుతంచేసి ఓం ఓం మహాశక్తి శ్రీం శ్రీం సర్వ
దారిద్ర్యవిధ్వంసినీ వాగ్జయీ దేవతావూంకుసు స్వాహా స్వాహా
యటంచున్ త్రికాలంబులం జెప్పుచున్నైనం బఠింప లిఖింపంగ
విన్నన్నిరుల్సంపదాయుర్వ్యశుల్ వర్ధిలుట ప్రేతభూతంబులెల్ల
ద్వారం గూలుట ల్మృత్యుసంహారమై బాధలెవ్వేని రాకుండుట
ల్నిశ్చయంబించు సందేహమొందైన లేదించుకేనం కదంబాట
వివాసినీ శ్యామలాంబన్వ భాష్యాన్వయోద్భాసితుండ న్వెంక
మాంబా జగన్నాథ సత్పుత్రుడన్ పుణ్యనామాభిఖ్యుడన్ మద్దలు
టీసమాభిఖ్య మొగ్గాడనామాంతర గ్రామవాసుండ నీసత్ప
దాంభోజదాసాన దాసుండ నా ప్రార్థన న్మన్నించి పాలింపు
మంబా కృపాడండ చెందుర్తినామాంతర గ్రామసంస్థానమూ
కాంబికా శ్యామలాంబా మదంబా నమస్తే నమస్తే నమస్తే
నమః.

## లఘుశక్తిదండకము

శ్రీమన్మహాదేవ దేవేంద్రవైవస్వతాదిత్యవాతాది సర్వా
మర స్తోత్రపాత్రా లసన్నీరజాత నేత్రాసనందాత్రి వ్యాసాం
బరీషాదిమౌనీంద్ర బృందాటవీదివ్య చైత్రాపవిత్రా మహా
[illegible] ఘోళి శుంభత్స ముజ్జృంభ మాణాసురానీకదోష్యగ్న

చంచద్ధనుర్ముక్త బాణావళీ చిహ్నితాంచద్వపుః పదాం
భోజ సంసేవకాపన్న మూహాంతపీఠా మహాదీన లోకావళీ
కల్పవల్లీ సుకోద్యల్లీ నూకాలతల్లీ ఘనస్ఫూర్తి దర్శింపవాతం
బులం గూలు మేఘంబులంబోలె నాయాపదల్బోవ మన్నే యు
టంచున్ హృదిన్నాల నూహించి యున్నాడనో తల్లి నీరూపముం
జూపి యీయమతిణీ కామినీ మోహినీ దైత్యరూపాష్మాండ
సంగ్రగ్రహాయమ్ములమ్ముం బాధలం బెట్టకుండంగ దత్కేశము
లుప్పట్టి పక్షంబులం ద్రెంచి పాదంబులంజించి హస్తంబులం
ద్రుంచి కంఠంబులం దున్కతానట్లుగా భూమిపైగూర్చి
యుప్పాటి నెల్ల న్గోలంగించి వారించి పసిపిల్లలున్నాకి యున్నట్టి
యష్టంబు వాతంబునున్ కాళ్ళయీడ్పున్ బరాకైన వాక్యం
బులన్ దాహముల్ మాన్పి యంగంబు లేశోపము న్జెందకుండంగ
రక్షించి యీపోకుళ్ళెల్ల స్వరంజిల్కగాజేసి జల్కంబు
లాడించవే పెంచవే తల్లి యీబాధలీ గ్రామమందెంత మా
త్రంబు లేకుండగా జేయవే నీదుపాదాబ్జభక్తుండ దీనుండ
నిత్యంబు సాష్టాంగదండప్రమాణంబుల న్జేయుచున్నాడ
దేవీద్విభాష్యాన్వయోద్భూతుడన్ పుల్లయాభిఖ్యదాసుండ
దుర్గాపినామాంతర గ్రామవాసుండ తల్లిన్మహాదీనుడై పిల్ల
లన్నంబుకై వేడుకున్నం దయం బెట్టురీతి న్జగజ్జాల మెల్లన్ద
యం బ్రోవుమా లోకమాతా మహాదారుణారాతి సంఘాత
ఘాతా, నమస్తే నమస్తే నమః.

## తలుపులమ్మ దండకము

**అను**

## సర్వకామదాంబా దండకము

శ్రీతలుపుతల్లీ భవఘ్నీమతల్లీ త్రిమూర్త్యంతితీత పూర్ణే
శ్వరీ భాస్వరీ. లోకమాతా మహాశక్తివై, సూక్ష్మవై వ్యక్తవై
భర్తవై కర్తవై హర్తవై సృష్టికాద్యంత శూన్యంబవై అంబవై
దేశదేశాల వేర్వేర పేర్లప్రభూస్థానవై, రాజివైదుష్టసంహార
కారంబునుం శిష్టసంరక్షయుం జేయుచున్. నీవు హిందూ
ప్రదేశంబులోనన్ తునిన్ తలుపులోద్దన్, మహాపర్వతోన్నత
శైలాగ్రభాగాలయ ప్రాయికంబౌ గృహస్థాయివై హాయివై
పూతసాకర్యలీల ల్ప్రదర్శింపుచున్, సేవకానీక కామార్థము
లత్క్షణ ధ్యానమాత్రంబునన్ గూర్చి, సంతుష్టులం జేయుచున్
పండితుల్పామరుల్ బ్రాహ్మణుల్ క్షత్రియుల్ వైశ్యశూద్రాదులున్
పూరుషుల్, స్త్రీలు, నాబాలగోపాలముంగూడ, నీగద్దె
కేతెంచులాగు న్నియోగించి సాక్షాత్పరాశక్తివై కామి
తార్థంబు లీడేర్చున్, మ్రొక్కులన్, బెక్కులన్ జేయ జెల్లిం
చుకొంచున్ మరిన్ వ్యర్థులై నిర్ధనాధిక్య దారిద్ర్యులౌ వారి
నా ధాన్య మాత్రంబుచే పూర్ణసంతుష్టులం జేసి, తత్తన్మనో
భీష్టముల్ గూర్చి సానందులం జేయుచున్నట్టి నీసత్ప్రభావంబు,
నేనెంతవాడన్ నుతింపంగ బ్రహ్మేంద్ర ముఖ్యాదులేనిం బ్రసం
గించి నీనిశ్చయార్థం బెఱుంగంగ లేరైరి కానిమ్ము యేమేమి
యైనన్ సరేకాని నాబుద్ధికి న్నీవు దోపించు రీతిన్నినున్

స్తోత్రముల్సేతు నాచేతులారన్ భవత్పాద పద్మంబులన్
నామనః పీఠకిన్ జేర్చి ధ్యానింతు, ఢిల్లీకి ఢిల్లీశ్వరిన్ పల్లెకున్
పల్లియే యున్న ఛందంబునన్ గొప్పవారల్నినుం గొల్వనా
గొల్వనందుం బ్రమణీకార భావంబు జూపింపక నన్ను గాపాడి
రక్షింపవే సద్దయంగాంచవే నామనోభావముల్ నెఱుంగున్న
వేగాన. వాటిన్ త్వరన్ మేలుచేకూర్పవే, శ్రీకళాస్వరూపిణీ
దుర్గ, దుర్గాడ గ్రామస్థలాగార వాస్తవ్య ద్విభాష్య సద్వంశ
శ్రీవెంకటమాంబా జగన్నాథ సత్పుత్రుఁడన్ ఫుల్లయాభిఖ్యు
డన్ నీదుదాసాను దాసుండ, పాలింపు మంగీకృతాస్మత్కృ
వితాభి సద్వర్ణనీయ స్తవాంగీ దయాలంబమానాంతరంగీల
సత్సుందరాంగీదృగం చత్కురంగీ ప్రపంచానుషంగీ, నమస్తే
నమస్తే నమః.

## భగవద్దండకము

పార్థమహావైరి సంహర్త గోత్రారిపుత్రా జగజ్జైత్ర సుజ్ఞాన
పాత్రా సుధాగోత్రా విశ్వంభరాభర్త కీవిశ్వమెంతేని యున్
ఘ్రాణిపాదంబులై నేత్రపద్మంబులై యుత్తమాంగంబులై యాన
నాబ్జంబులై శోకజాలంబులై యొప్పునా యున్నతస్ఫూర్తిచే
లోకమావృతమై వర్తిలున్విశ్వ సృష్ట్యాత్తి నాభిస్వభావంబున
న్విశ్వ మధ్యంబునా కన్న పృష్ఠంబునుందోఁచి యాద్యంత
శూన్య ప్రభావంబు సంధిల్ల వర్తిల్లు నాపూర్ణరూపంబు బ్రహ్మా
దులుం దెన్నగాలేదు తద్దేవతా ధీశుజూడంగ నీనేత్రములొప్ప

శ్రీముల్గావు తన్నామధేయంబు దాబ్రహ్మ రుద్రాసుర శ్రేణి
కిన్ లేమ తత్స్వార్తి సత్యంబు సుజ్ఞానవంతంబు నానొప్పు
నాదేవ్యశ్రీ స్పష్టిపాతాత్ పరత్వంబున స్వేయిమూర్థంబుల
స్వేయిశ్రేత్రంబుల స్వేయిపాత్రంబులం దాల్చి విశ్వస్వరా
శ్రూపము యుద్భవంబయ్యు విశ్వేశమాపూతనంబై ప్రవర్తిల్లి
శశ్వత్త్వంబైన యాత్మాభిమానంబునుంబొంది కర్మాంగుళా
కారతం [illegible] భూతాళి భస్వంబు గావించి తానింతకు న్మూర్తిత్వ
భావంబు చేతం బ్రవర్తిల్లి నాదేవు సృష్టిన్ విలోభిల్లు నాపుండరీ
కాక్షు డానందసంప్రాప్తుడై [illegible] శ్రేయోమహాస్ఫూర్తి
యైనట్టి శ్రీలక్ష్మిగావించె, నాత్మీయ మాహాత్మ్య సంపత్తి
విశ్వంబు పాదంబు మోక్షంబు పాదత్రయంబై ప్రవర్తిల్లగా జేసి
విశ్వంబు గావింప నారంభియై యంతశీఘ్రంబునం జేసి నాపుణ్య
చారిత్రుడై విశ్వసంధాతయైనట్టి జీవాళి మానంబుతో నొప్ప
రాజద్విరాణ్మూర్తి గల్పించి యామూర్తి విశ్వంబుతో గూర్చి,
భూమిం బురశ్రేణిఁగల్పించి, దోర్దండమహావిస్సృష్టి గావించి యారాయ
జము శ్రేహమై యున్న గీర్వాణులన్ జేసి పారావసంతంబునన్
స్వాంతనామంబు గల్పించి, యాఖ్యంబు గావించి గ్రీష్మంబు
గల్పించి, ధర్మంబు గావించి, పార్థా శరస్సృష్టి గావించి, యాయజ్ఞ
కర్మంబులన్ జేసి తోడ్తో రహిజ్ఞాలమున్ జేసి నాసత్యసంఖ్యా
కభాస్వత్త్వరిత్యగాద్యాలి గావించి త్రింసత్త దివ్యసమిక్కల్ప
నక్షచేసి యాదేవదేవుండ వే కామరశ్రేణి గల్పించి మాసంబు
గల్పించి పుంస్త్వంబుతో నొప్పు నుర్వింబశుప్రాతముం జేసి

యాగ్నింబసిన్ హిస్సు లంబ్రోక్షణ శ్రేణియజ్ఞం స్సృజంమహా
దేవుడావృత్తిసే దేవతాసాధక జాలం లం దృష్టిఁ బొందించె
వ్యాజంబు గల్పించెనా వాయుసర్గంబు గావించి, గ్రామ్యంబు
లన్ జేసి యారణ్యసరంబు గావించి పార్థా పశువ్రాతముం జేసియా
కర్మంబుసంతృప్తి గావించి బుగ్వేదమున్ నాసం బెద్ది బాహుద్వయం
బెట్టి యూరుద్వయం బెద్ది పాదద్వయం బెద్ది, యా దేవునాస్యంబునం
బ్రాహ్మణుల్ బాహులన్ క్షత్రియుల్ వైశ్యలూరుప్రదేశంబు
లన్. శూద్రములున్ మేటిపాదంబులం బట్టి రాదేవు చిత్తంబులో
లోకజాలంబ నేకంబుగా బుట్టె నా దేవుసామర్థ్యమిట్లే ప్రవర్తిల్లె
నీసృష్టి నిర్మాతయైనట్టి దేవుండు సూర్యప్రభాభాసియై యంధ
కారంబు సంఖిల్లకుండన్ ప్రవర్తిల్లె నీసృష్టికిన్ నామకర్మాదు
లం జేసి ధాతన్ బురస్కృత్యగా జేసి ఈసృష్టిగావించు నద్దేవు
విద్వాంసు దేవేశు దివ్యస్వరూపున్, మహావీరుసాధింప నీకర్మ
మేగాని యుక్త్యంబు లేదంత తద్దేవతాదీశునిం గూర్చి, యజ్ఞంబు
గావించి దివ్యాళీ సాధ్యాళి, సర్గస్థులై రిట్లు భూదేవతల్
యజ్ఞకర్మంబు గావించి. యాదేవలోకంబునుం జెంది సౌఖ్యం
బునుం బొంది రా వేళ నాదేవుడీ భూమి విశ్వంబ రాకారమున్
దాల్చి, యూర్మ్యాకృతై భారముం దాల్చె, నే దేవు గర్భంబునన్
బ్రహ్మావతిల్లెనే స్వామినిన్ జన్మముల్లేక జన్మంబు నంధిల్లె.
నాదేవుజన్మంబు లాకర్మంబు లధ్యాత్మవేత్త ల్పరీక్షింతు
రే దేవుడీ దేవజాలంబు సంవృత్తమొందగ నద్దుష్టులన్ గూల్చ
నా జన్మముల్ దాల్చె సౌఖ్యంబు దుఃఖంబు లందించు

నేస్వామి యేస్వామికిన్ లక్ష్మియున్ భూమిధర్మార్థ కామా
దులున్ లోనుగానుండు నేదేవు సుశ్లోకము బ్రహ్మరుద్రాది
దేవాళి కీర్తించి నేదేవు కీర్తించి భక్తాళి తేజోమయంబైన
లోకమునందుండు నాదేవునిన్, నిత్యునిన్, సత్యసంకల్పునిన్
నిత్యకళ్యాణునిన్, దుఃఖసంహారకున్ సౌఖ్య సంధాన యుక్తు
సన్నుతింతున్మరిన్నన్నుతింతున్మరిన్ స్వామిధ్యానింతు నాదేవు
కీర్తింతు నాదేవు నన్నోమువాగా నేడుకొందున్సదా పాదుకొం
దున్ జగన్నాధ, సర్వేశ్వరా పాహిమాం, త్రాహిమాం, దేవ
దేవ నమస్తే నమస్తే నమస్తే నమః.

## మహాశక్తి దండకము

శ్రీమన్మహాదివ్య వాణీభవానీ మృడానీ భజేకూటరాణీ
భజే నీలవేణీ గదాఖడ్గపాణీ నమోపువ్వుబోణీ సువర్ణాభగాత్రీ
సుధాసుప్రతాపీ సుగుణ్యానుమోదీసనా త్రిపురసుందరీ మం
జులభాషిణిమదేభేంద్రయాణి మహామాయతల్లీ వశీకల్ప
వల్లీ మిముంగొల్చి పూజింతు మోయమ్మ యోకొమ్మ జేకొమ్మ
బంగారు పూబొమ్మ మిమ్మున్ మదిన్ కీర్తిసేయంగ నేనెంత
వాడన్ మహామూఢ చిత్తుండ నాచేసి నటంతటం బూని
పూదండగా దండకం బొక్కటింజెప్పి మీకున్ సమర్పించె
దన్ ప్రేమతోడన్ దయాదృష్టి వీక్షించి నన్గాచి నాజిహ్వకుం
దోడుగావమ్మ యోయమ్మ పళ్యాల తల్లీ భజే భద్రకాళీ పరా
నందకేళీ మహాజ్యోతిరూపీ మహాంకాళిశక్తీ మహామాయి
విన్నన్నడుం జూడ నెట్లుంటివేని దగన్విన్నవింతు న్భజింతు

స్మ్రదిం జోల నాలించి రక్షించుచుహా లంకలో శంకరీసంజ్ఞనే
కంచికామాక్షి వే కన్యదుర్గాంబ వేయుటం శృంగార శ్రీప
మ్మునం పాంగాడిం తల్లి వేనీవు రంగయిన అలంపురే బంగాళీ
దేవి వే వర్ధాపురంబునం దోడైన గిరిజ వే శోభనైన శ్రీశైల
భ్రమరాంబా దేవి వే కొల్లాపురంబునం తల్లి మహాలక్ష్మి వే
జోకైనమాహూరు యేకవీరమ్మ వే నాణెముగ ద్రాక్షాపురి
మాణిక్యదేవి వే నీచుమున హరిచక్రమున కామరూపందురే
సృష్టిలో జ్వాలమున వైష్ణవీవందు వే మహానిప్రయాగ నుంమున
మాధవీవందురే శృంగారమున గయామాంగళ్య గౌరినను
వారణాసియందు విశాలాక్షి వే మహిమతో నుజ్జయిని మహాం
కాళి దేవి వే పీఠికాపురియందు పురుహూతిదేవి వే ఘనత సర
స్వతీకాశ్మీర మందును ఇన్ని పీఠంబులన్ యిలనుతికెక్కి తే,
షణ్మతములవారు వరుస నిన్నుగొల్తురే, వర్ణాశ్రములవారు
వరుస నిన్ను గొల్తురే, అన్ని మతములవారు అన్నినామంబు
లన్ అలను పూజలు గొందు అమ్మ శ్రీలక్ష్మిరో, వరయుతులు
వేగనిను ఓంకారి నందురే మహిని పాంచాలైన మహమ్మా
యినందురే, గరిమతో శూద్రులును గంగమ్మ వందురే
పంచములు షష్టములు నరచాంద్రువందురే మరిలోక కొలభు
లును మాతననుకొందురే యిన్నివర్ణంబులును యిలపూజ
గొందురే గ్రామముల నన్నిటికి ఘనమైన వేల్పువే. లోక
ములన్నిటికి లోకైక మాత వే, జనులందరిబ్రోచు ఘనలోక
మాత వే, మూడులోకంబులకు మూలంబు దేవి వే, మూడవ

తారంబులు మొనసిపుట్టింతువే భూతజాలములన్ని పోషించు
తల్లి వే యింక నీనామములు యెవ్వి వర్ణించెదన్ పరితాపహతి
నిన్ను భక్తిలో గొల్చెదన్ కుంభకోణేశ్వరిని కోరిచేభజిం
తున్ రామ చండీశ్వరా రమణితో మ్రొక్కెదన్ చిదంబరీ
చెలువు వర్ణించెదన్ అఖిలాండేశ్వరీ అడుగులకు మ్రొక్కె
దన్ మధురమీనాక్షీ నీపాది నుతిజేసెదన్ దాని ప్రసుదవతిని,
కీర్తివర్ణించెదన్ అరుణాచలేశ్వరి అభినుతి చేసెదన్ కంచి
కమాక్షీవే కనకదుర్గాంబవే గోరుగంటితల్లివే ఉదయగిరి
తల్లివే చందపోలమ్మవే కొండవూడి వెలయు గురుతులేస
మ్మవే తామరమడుగనను దండీ అంకమ్మవే ధట్టించు
మాచెలపుట్టించు శక్తివై పుడమినుతి కెక్కుడను భూరికం
కాళివై చేటులయిన యాతముక్కల జాగు లంకమ్మవే గంగ
పట్టమంచు ఘనసారమూర్తివే వెల్లురుకు వెల్లూరిగంగమ్మ
తల్లివే నయమయిన అద్దంకి నాంచారుశక్తివే నెలకొండపల్లెలో
కరపుట్టలమ్మవే సొగసైన బండారు ముగదారుతల్లివే ధరపట్టి
సంబునను ధరభద్రతల్లివే పిఠాపురతల్లివె యిలలోను బాగ
డొందు యింద్రాక్షితల్లివె పడమటదేశాని పరగ దేశమ్మవె
అరయంగదూర్పునట అశిరిపోలమ్మవె చెలగిదక్షిణమునను
శిస్తారినందు రే అరయనుత్తరమునను అంబవినుగొల్తురే పరగ
బాయకటబడలకౌమారివె చెలగిమనిన యాబాన శిందుకోటీ
రమునను అరయంగజలూర్పారి అశిరమ్మవందురే మండపాకి
ప్పవె మామిళ్ళతల్లివె జోకైనచింతలను యాకంబదేవివె

శింగనాపల్లెలో శ్రీనాగబొమ్మవే వన్నెయిన మాగంటివన్నెరు
తల్లి వే కంటగారేలంగు మెంటాలతల్లివే పొసగన త్రిలిపురము
పోలేరుతల్లి వే పరగమంచిలియందు పళ్యాడతల్లివే గొండమా
రమ్మవే బండిపోచెమ్మవే అరయంగ తూర్పునను పలనాటి
తల్లి వే ఘనముగా యేలూరిఘంటాలమ్మ తల్లి వే నీయేడుగురితో
బుట్టు ఈశ్వరీ అమ్మరో అంబనినువర్ణింత నీతి తప్పనేస్వీశిరి
నీమహాత్మ్యంబెల్ల నిట్టులైన యెరుగక యెవరుగర్వించినా యెవరు
గర్వించినా యెవరుదూషించినా కిరిజవొయమ్మ చక్కని
మద్దెపూ బొమ్మాంబంగారు పాపమ్మ సంపరదేశమ్మ సంతాల
పోలమ్మ మొదలైన మహాశక్తులంబట్టి మూర్ఖులంబట్టి గర్వాల
న్బట్టి శిక్షింపచెండాడ వేరూపుమాపింతు వే వేకిపుట్టింతు వేరోత
పుట్టింతు వే యేపుదప్పింతు వేచంక లెక్కింతు వేమళ్ళుదూళింప వే
ముక్కులన్ బెక్కులన్ చిక్కులన్ బొక్కులన్ తొర్రలుగజేతు వే
ఏపగంధములన్ బూతపెట్టింతు వే షడ్రస్నానంబుపై రోతపుట్టిం
తు వే గుల్లుదేవింతు వే జెట్లుమునిగింతు వే దిబ్బినలు గబ్బినలు
గుప్పుమనిపింతు వే ఉప్పునాకింతు వే తల్లియెల్లారి భద్రమహే
శ్వరీ జంజమన్ వేదవేదాంగముల్ విశ్వంబరీ వెన్నుగాలం
బుల న్వోపజంద్యబులన్ గూటికుంభంబులన్ నోటితాలంబులన్
భక్ష్య భోజ్యంబులన్నిట్లు ఖండంబులబ్జమిడి పానకము చక్కె
రల్ పాయసము చక్కనౌకోకల్ మక్కలా యేటలన్నెక్క

వరకుంభముల్ మక్కువతో దెత్తురే మాటికినిత్తురే గండముల్
దెత్తురే కొండలంగెల్తురే కోరములుడల్తురే అమ్మ నీకు నేను
మ్రొక్కెదన్గాన నన్ను బోషించుచందాన మాయింటుగుప్పాటుగు
మాయిల్లు మాస్త్రీలు మా పశువులన్బాలులన్ వృద్ధులన్
న్బాగుగాగాచి రక్షించుమహంకాళి శ్రీభద్రకాళి అహోరాజ
మాళీ జవాజీవనాళీనరాళీ కపాళీ యిదే నీకు మ్రొక్కెదన్
మాటికిన్మొక్కెద మమ్మాటికిన్ తల్లి శ్రీభద్రకాళీ నమస్తే
నమస్తే నమస్తే నమః.

## శ్రీకృష్ణదండకము

శ్రీకేశవా శ్రీశివారాధ్య గోవిందనారాయణా గోపికా
లోల గోపాలబాలాహారీ మాధవా శ్రీధరా రాధికాకాంత
శ్రీశారమేశాయుమేశప్రియా కృష్ణ విష్ణూ హృషీకేశ యజ్ఞేశ
యజ్ఞాంగ యజాధిపాయజ్ఞకృత్ యజ్ఞభృత్ యజ్ఞధృత్
యజగృహ్యా మహాయజ్ఞ సద్యాలవా యజ్వ యజ్ఞాంతకృత్
యజ్ఞభోక్తా పరంధామ సంరక్షణా పంకజక్షేత మోదూరదా
మోధదా నందగోపాలబాలా ముకుందాసదానంద శ్రీసచ్చిదా
నంద కందానుబంధుప్రియా దీనబంధూ ఉపేంద్రా మహేంద్ర
స్తుతా దీనచింతామణి దైవచూడామణీ యార్తరక్షామణీ

ఘూర్త శిఖామణీ యచ్యుతా యాదిదేవా యమోఘాయచిం
త్యా యనంతపతీదాన కల్పద్రుమా వాసుదేవా మహాదేవ
సంసేవ్యమానాంఘ్రి నీరేజహా నన్ను మన్నించి రక్షింపవే
శ్రీహరీ భక్తకల్పద్రుమా నీయనుంగుం జెలుల్పాండవుల్
మోసకృత్యంబున న్వంచకుండుం మహాఘాతకుం డైన జాత్యం
ధుచే నిట్టులానీతులై కుచ్ఛితుండున్ మహాఘోరపాపిష్ఠియుం
నీతిబాహ్యుండు దర్ద్యూతశీలుండు మాయాప్రవీణుండునౌ
సౌబలాభిఖదుర్బుద్ధితో సర్వరాజన్యమాన్యుండు సంసేవ్యమా
నుండు పూజ్యుండు సేవ్యుండు నన్యాయబాహ్యుండునౌ ధర్మ
జుం జూదమాడించి దుర్న్యాయతంత్రంబుచే నందునోడించియు
స్సర్వరాష్ట్రంబులైశ్వర్యముల్ ద్రవ్యముల్ జంతుసంపత్తినిం
బుత్రులంగెల్చి ఓయాదవేంద్రా ఉపేంద్రా మహేంద్రాప్రియా
కృష్ణయేనెట్లుగా విన్నవింతున్ ప్రభూ అయ్యయో నాదుప్రాణే
శ్వరుల్ నీదుప్రాణంబునుంబోని మిత్రుల్మరి న్మేనబావల్వారీ
పాండవుల్దమ్ము గోల్పోయి దుష్టస్వభావుండు దౌర్జన్యశీలుండు
దుర్మార్గలోలుండు దౌర్భాగ్యభోగ్యానుభూతుండు దుర్బుద్ధి
దుర్యోధనోన్మత్తు డానంబున న్జిక్కరయ్యో కృపాలోల నన్ని
ష్వాడీ నీచు దుశ్శాసనుం డక్కటా రాణివాసంబులోనుండి
ధమ్మిల్లబంధంబు చేబూనినాపాచముల్త్రొట్రులాడ న్సరీరంబు
ఘోరంబుగా నల్లలాడ న్కురులేడ్వనాచీరజీరాడ నాయాస
మెచ్చించుచు న్నొప్పుపుట్టంగ గానంతయుంజాలిలే కిట్లు

విద్వాంసులు సత్కవీంద్రుల్ మహానీతివేదుల్ గురుల్ బాంధవు
ల్సర్వసామ్రాజ్యపూజార్హు రాజపుత్రుల్ ప్రసంగొల్చి సేవించు
తున్నట్టి యీ సత్సభామంది రాజ్యాంతరంబుం బ్రవేశంబు గా
కీడ్చుచుం దెచ్చి స్వామీ దయాసాంద్ర ఓ దేవదేవేంద్ర యీ
క్రూరుడే మూఢుడే దుర్మదాంధుండు నన్మొట్టుచు న్దిట్టుచు
నవ్వుచుం దువ్వుచుం బెక్కుమారంబుల న్మానభంగంబు
గావించియుం దృప్తినొందంన మోఁచున్న యీయున్న సభ్యుల్
నృపుల్ బ్రాహ్మణుల్ పండితుల్ ర్వాసుప ల్భూపతుల్ చూచు
చుండంగ నా మానభంగం బొనర్పంగదా కంకణమ్మాని
యన్నయ్య యీకోల్పడిం జెంది నాపుట్టముల్ ముట్టుచున్నా
డు నా వస్త్రముల్లాగుచున్నాడు నా వల్వ తా నొల్చుచున్నాఁడు
నాచీరఁదాఁజీరుచున్నాడు నాకోక దా విచ్చుచున్నాడు
నాబట్ట దాఁబట్టి యున్నాడిదే చూడరావే దయాళూ కృపా
లోల కారుణ్యశీలా హరీయో మురారీ మురారిప్రియా పుండ
రీకాక్ష యుత్మత్కటాక్షేక్షణం బీక్షణ బిందుపేక్షించినన్నున్న
రక్షించు దిక్కెవ్వరే యావదుద్ధారకా యార్తరక్షామణీ
భక్తసంత్రాణ పారాయణా లక్ష్మినారాయణా యిందఱుంగల్గి
యుం దిక్కులేనట్లు లీపట్టున న్వచనం బొందుచుంటిం గటా
చెంత నే నాథులుం గల్గియున్నట్లె ననాథన్వలెన్ లోకువైపోతి
లోకత్రయారాధ్యశీలుండవౌ నీకు గారాబపుంజెల్లినై యిం
తకుం జెల్లితింగాదె యీ మానభంగంబుకంటె న్సదా ప్రాణ

భంగంబె మేలంచు నేనెంచుచున్నాననంగా ననుంగావరా వేల
నాపైఁ జిరాకా పరాకా సరేకాని మున్నాధ్రువుండుం గజేం
ద్రుండుం సుగ్రీవుడల్లా దశగ్రీవు తమ్ముండు ప్రహ్లాదుఁడుం
జాంబవంతుండు లోనైన సద్భక్తులన్ ముప్పుఁదప్పించి రక్షించ
లేదా అదే మాదిరి న్నన్ను బోషింపరాగా అయ్యో బుద్ధి
వాదా దయానీరముం జిల్కగాబోద నీసోదరిన్ ద్రౌపదిన్
శత్రుమధ్యంబునం జిక్కి వేరెవ్వరుం దిక్కులే కెంతయున్
గ్రుక్కియున్ ప్రాణంబుపై నాసలెల్లం దిగ న్రొక్కియే బెక్కుగా
మొక్కుచున్నావయో యిట్టి నాకష్టకాలంబునం దొక్క
వస్త్రంబు దానంబుగా నిచ్చుచే భారమా గోష్ఠగంభీరమా
నేరమా యో రమానాథ యీపాటి సుప్రాప్త దానంబు నేనం
బ్రతీక్షింపగా నేరమా దూరమా భారమా రాను గాను
భవన్నామ బృందంబుపైనం గృపాలేశమున్ లేకనో రాకయో
రాకయో కాకమా పూర్వజన్మంబులం జార్జితంబైన బ్బా
పమా కోపమా ఓ పరంధామ వైకుంఠధామా కటా బాల్య
ముందొట్టి మా యాపదల్ బాపుచున్ మంచిమార్గంబులన్
చూపుచుం బాపపుంజంబుల జేరనీ కెడల్వాపుచుం బ్రోవు
చున్నావు గానే యిదే క్రొత్త ట్రోవల్ కృపం జేసరా నే
కుచాన్యాహా శ్రీకృష్ణ గోవిందహాత్మాంతకా గోపికా గోలా గోపాల
భాలా దయాశీల నీ భావలున్ మస్తులు నీవె దాసన్యంబునం
జిక్కి నోరెత్త గా లేక చిత్తంబులం దుత్తలం పాటు హత్తించి

యున్నారుపేక్షింపగాబోకు మాజీవితస్వామ్యములం దాస్యనిర్మ
క్తులంజేసి నాగాసియుం దీర్చి యేదోసము మోసము నివ్వీస
మున్నాకు రానీక మాపూర్వరాష్ట్రంబు నైశ్వర్యముంబుత్రు
లం జంతుసంతాన బృందంబు నిప్పించి మాముప్పు దప్పించి
మెప్పించి రక్షింపవే దోషభూయిష్టగా శత్రులంబట్టి శిక్షిం
పవే మమ్ము దీవించి చేపట్టవే కానరావే దయాళూ క్షమాళూ
కృపాళూ రమేశా యమేశాప్రియా కృష్ణగోవింద శ్రీపుండరీ
కాక్షవిష్ణూ నమస్తే నమస్తే నమస్తేనమః

సంపూర్ణము.





శ్యామల ప్రెస్ : రాజమండ్రి.

వచన రచనలో సిద్ధహస్తులైన

**శ్రీ పురిపండ అప్పలస్వామిగారి**

# రామాయణం - వచనం

| | | |
|---|---|---|
| 1 | బాలకాండ | 3-00 |
| 2 | అయోధ్యకాండ | 6-50 |
| 3 | అరణ్యకాండ | 3-50 |
| 4 | కిష్కింధాకాండ | 3-50 |
| 5 | సుందరకాండ | 4-00 |
| 6 | యుద్ధకాండ | 7-50 |
| 7 | ఉత్తరకాండ | 5-50 |

పూర్తి సెట్టు వెల 33-50

ఇది వాల్మీకి మహర్షి సంస్కృత రామాయణానికి సొదుక భాషలో సరైన అనువాదం: పండితులకు పామరులకు, స్త్రీలకూ, చిన్నపిల్లలకూ, అందరికి అర్థమయ్యేటట్లుగా తేట తెలుగున సులభ శైలిలో రచింపబడినది.


**కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు**

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి.

# జవహర్‌లాల్ నెహ్రూ సమగ్ర చరిత్ర

సంకలనః- శ్రీ వేమనూరి గంగాధరం.

ఏ యితర గ్రంథంలోనూ లేని విషయ విశేషాలతో, ఏర్చి, కూర్చి, తీర్చిన సమగ్ర చరిత్రమే యీ గ్రంథం.

ఇందులో నెహ్రూజీ కుటుంబ చరిత్ర జననం నుండి నాటిదాకా దేశీయ విదేశీయ కార్యకలాపాల సంపూర్ణగాథలూ పరిణామమూ, అంతిమయాత్రాది విషాద ఘట్టాలూ, దేశ విదేశముల నాయకులను, ప్రముఖులను, పత్రికలను సమర్పించిన అశ్రునివాళులూ కూర్చబడ్డాయి.

భారత స్వాతంత్ర్య సమరాసక్తై, నేతాజీ సుభాసుచంద్రబోసు అంతర్ధాన గాథ, అజాద్ హింద్ ఫౌజు కార్యకలాపాలూ చేర్చబడ్డాయి.

నెహ్రూజీ ఉపన్యాసాలూ, రచనలూ, సూక్తులూ, పొందు పరచబడిన సంపూర్ణ నెహ్రూజీ ప్రతిబింబమే యీ గ్రంథరాజము.

నెహ్రూజీ. ఆజన్మాంత ఛాయాచిత్రాలు పొందు పర్చబడినది. త్రివర్ణ ముఖ చిత్రంతో నెహ్రూజీ. ఆఖరుపేజీలో తొలిమలి ప్రధానుల కలయికచిత్రంతో సర్వాంగ సుందరంగా దీనికిదే సాటిగా, ఎనిమిదివందల పేజీలతో వెలువడినది.

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్

రాజమండ్రి

వెల రు. 15-0-0